# కోటిలింగశతకము.

---

ఇది

సత్యవోలు అప్పారావుచే

రచింపఁబడి.

మానవ సేవాపత్రికయందు

ప్రకటింపఁబడినది.

---

రాజమహేంద్రవరము.

శ్రీ మనోరమా, ప్రెస్ [illegible] ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడెను.

1912

వెల 3 అణాలు

# కోటిలింగశతకము.



సీ. శ్రీలఁ జెలంగు నీక్షితిజీవరాసుల సతతంబు గాపాడు సామి యెవరొ
దుష్టశిక్షణమును శిష్టరక్షణమును సలుపుచు నుండెడి సామి యెవరొ
కరుణతో దీనులఁ గాచి మన్నించెడు సదయులఁ బ్రోచెడు సామి యెవరొ
వికలవర్తనమును వెన్నంటి తెలుపుచు సమబుద్ధి నొసఁగెడు సామి యెవరొ
యెఱుఁగలేనట్టి మాహాత్ములెందరైన గలరు ధరలోన వారితోఁ గలసిమెలసి
యుండు నరులకు గష్టంబు లుండవన్న? కుటిలజనభంగ! సత్సంగ! కోటిలింగ! 1

సీ. సకలపదార్థముల్ సమకూర్చి జీవుల వరకృపామతి బ్రోచు పంటకాఁపు
గాఢమౌ కలుషాంధకారంబు నెడబాపి చక్కఁగాఁ గాపాడు చందమామ
మానసంబులలోన జ్ఞానతేజంబును ప్రసరింపఁజేయు ప్రభాకరుండు
శాంతాదిగుణముల సమకూర్చి తనవారి సంతుష్టులుగఁ జేయు సంపద్దాత
ఆదిమధ్యాంతశూన్యుఁడై యలరువాఁడు నున్నవాఁడును లేఁడనుకొన్నవాఁడు
మానసోద్యానవీథుల మరిగినాఁడు కుటిలజనభంగ...... 2

సీ. అచలకింజల్కంబు నానందరసపూరమై వెలుఁగుచు మానసాంబుజంబు
నిగుడుచునుండఁగ నెఱిఁగానలేక సంసారసాగరనిమజ్జనము కలిమి
కాసారముల చెంత కాననంబుల చెంత పర్వతశ్రేణుల పాదపముల
జడమతి పుష్పమంజరులకై సతతంబు సంచరింపఁడె పూఁచ సలుప నెంచి
శాంతమును సత్యభాషయు శమము దమము విమలవిజ్ఞానమును గల్గు విబుధవరులు
చేయుబోధల వినకున్న చేటుగాదె? కుటిలజనభంగ...... 3

సీ. సకలశాస్త్రంబులసార మెఱింగిన ఘనమైన పాండితి గలిగియున్న
బ్రహ్మచర్యంబును బడిబడి సల్పిన తీర్థాల వెంబడి తిరుగుచున్న
క్రతువుల నెప్పుడు గావించుచుండిన వ్రతములఁ జేయుచు వఱలుచున్న
యతివేషములఁ దాల్చి యాచించుచుండిన వేదాంతవేద్యులై వెలయుచున్న
రిత్తకోరికలకు లోఁగి భక్తితోడ నెన్ని పూజలఁ జేసిన నేమిఫలము
ధర్మసత్యశాంతంబులఁ దప్పువారు కుటిలజనభంగ...... 4

సీ. అనవరతంబు మోహాటవిలోఁ బడి చరియించు యుపతీకుచగిరులందు
గొండ్లి సేయుచునుండు గొంటుతనంబున నాశ లన్ శాఖల నత్తమిల్లు
విమలవర్తన మను విజ్ఞానవల్లరీ పుష్పమంజరులను పుణికివేయు
గొనము లేకుండుట ననరాని కార్యంబు లెన్నెన్ని జేయుచునున్న సుంత
తనివి నొందఁడు మానసవనచరుండు। రాగలతబద్ధుఁడై యుండి భోగపరత
దేహ మస్థిర మనుమను తెలియలేఁడు కుటిలజనభంగ...... 5

సీ. జలములో సతతంబు జలకమాడుటఁ జేసి పరమపావనుఁ డంచు బలుకఁదగునె
యుపవాసముల నుండి వపువు స్రుక్కఁగఁ జేయు పరమపావనుఁడంచుబలుకఁ దగునె
సంగేచ్ఛలేమిచే సకియపొం దెడబాయు పరమపావనుడంచు బలుకఁ దగునె
యాకలంబుల మెక్కి యన్నంబు దినకున్న పరమపావను డంచు బలుక దగునె
మోక్ష మిచ్చుట కివ్వియే మూలమైనఁ। జేఁపలు దరిద్రజనములు జెందకున్నె
షండులును వానరంబులు సఫలముక్తి! కుటిలజనభంగ....... 6

సీ. ధనకాంక్ష లేక సద్ధర్ములై యుండుట వేషధారణ లేక వెలయుచుంట
కాయకష్టంబుచేఁ గలుగు ధనంబున జీవయాత్రను జెల్లఁ జేయుచుంట
అందఱు మొక్కటే యనుమాట నెరనమ్మి పరులసౌఖ్యమునకై పాటుపడుట
ప్రాయంబు బుద్బుదప్రాయంబుగా నెంచి క్షాత్రధర్మంబుతో జరుగుచుంట
మానవుల మనోవీథుల మసలినట్టి। దినములు గతించిపోయె నీదేశమందు
కలరు దుర్జను లీనాఁడు కలవు తీర కుటిలజనభంగ....... 7

సీ. వేషభాషలలోన విద్వాంసులన నుండి నీతివర్తన లేని నీచమతులు
జపతపంబులఁ జేయ నిపుణులై యుండి సత్యభాషణ లేని చపలమతులు
నీతిని బోధింప నేర్పరులై యుండి దుర్వర్తనము సేయు దుష్టమతులు
పరకాంతలను గూడఁ బాడిగా దనుచుండి వేశ్యలతో నుండు వికలమతులు
తగనివేషంబులను దాల్చి పొగడుకొనుచు। మోసపుచ్చఁగ నేర్తురు మూఢమతుల
సాధువులచెంత తమయాట సాగిరాదు. కుటిలజనభంగ..... 8

సీ. ధనము గల్గినదంచు తగనిగర్వమె కాని బుధుల నాశ్వాసించు బుద్ధి లేదు
విద్య నేర్చితి నంచు విఱ్ఱవీగుటె కాని మంచిచెడ్డల నెంచు మనసు లేదు
కర్తృత్తి నేనంచు కరము బల్కుటె కాని వారాంగనాసక్తి వదలలేదు
తత్వవిదుఁడ నంచు తాఁ జెప్పుటయె కాని పరమదుర్మార్గంబు బాయలేదు
సంఘసంస్కారుల మటంచు జాటువారికడన దుర్వర్తనంబులు కదలలేదు
కాల మొకరీతినుండదు గాదె జగతి? కుటిలజనభంగ...... 9

సీ. చేరి సంస్కారులఁ జేయఁ జాలరు గాని తమ సద్గుణంబుల నెమకలేరు
పెరకాంతలకు విద్య గరపఁ జింతురు గాని తమవారి మౌఢ్యంబు దఱుమలేరు
జాతిభేదము లేల జనుల కంచురు గాని వెలిపత్రికల జూని చెలఁగలేరు
అన్నమాటల తప్పు నెన్నుచుందురే గాని పరుషవాక్యములను బాయలేరు
పైపటాటోపముల జూచి భ్రాంతి జెంది, పేరునకుమాత్రమే గొప్పబిరుదు దాల్చి
మోసపుత్తురు ప్రజల నీవేసగాండ్రు, కుటిలజనభంగ.......... 10

సీ. సత్యసంధుఁ డటంచు సభలలోఁ జాటిన మాత్ర ప్రల్లదములు మాటువడునె
నీతిమంతుఁ డటంచు నెంతవర్ణించిన తగని దుర్గుణములు దగ్ధమౌనె
దానశీలుఁ డటంచు తనవారు వాడింప పిసినిగొట్టుతనంబు విసిగిపోనె
కరుణామయుఁ డటంచు కరము బల్కుచునున్న మాంసభోజనములు మాటువడునె
నడవడులు చక్కఁగాలేని నరులు పరుల, మోసపుచ్చఁగ దాల్చరే వేసములను
వాని జూచి భ్రమించెదు వారు గలరె, కుటిలజనభంగ............. 11

సీ. కమలాక్షి సొగసుకన్నవ గాంచి మది సొక్కి కలయఁగా వలెనను కాంక్ష బొడము
తరుణుల యధరముల్ తలిరాకులని నమ్మ స్మరచాపహతి జెంది మరులు గొనుచు
పొలఁతుల కనుసన్న దిలకించి విలపించు మరువారి కోర్వక పొరలి పొరలి
సకలసౌఖ్యంబులు శాశ్వతములె యని భావించు మోహవిభ్రాంతి జెంది
కాని దలపఁడు వ్యాధ్యభిమానగ్రస్తమైన దేహ మస్థిరమని యాత్మలోన
జడమతుల జేరి తరమౌను చక్కఁజేయ, కుటిలజనభంగ.......... 12

సీ. పరమపావనలైన పడఁతుల వీక్షించి మదనార్తిఁ గుందు దుర్మార్గుఁ డొకఁడు
చలికాడ నినుఁ బాసి మెలఁగలేనని కూర్మి జూపి మోసముచేయు శుంఠ యొకఁడు
సభలలో నీతుల చక్కఁగాఁ దెల్పుచు నవ్వుల నెగవేయు నధముఁ డొకఁడు
మంచివారినిఁ జూచి మది సహింపఁగలేక దూరి నాశము గోరు దుష్టుఁ డొకఁడు
నీతిమంతుఁడు, కూర్మిసంగాతకాఁడు, సత్యవాక్యసంపన్నుఁడు సంప్రదాత
గాఁడె యానాఁడు లోకులు గారవింప, కుటిలజనభంగ............... 13

సీ. స్నానంబు గావించి సన్నదువ్వలువలు పూన విభూతియు మెఱయఁజేసి
తావళంబుల దాల్చి తపసి నాఁ బుట్టకై తగిరొ యుంటి నటంచు తనివినొంది
పల్లికూడు కుడిచి చయ్యన చేతెంచి వీధుల యాచించు విప్రవరుఁడు
కరుణావిధే యంచు కరముఁ బల్కుచునున్న పరమభక్తుం డనఁబడునె చనటి
అట్టి దుర్మార్గు లుండిన యవని సుజన, సంఘమైనను దౌర్బల్యసమితిగాదె
మోసగాండ్రకు గుఱవ్వ లీ వేసగాండ్రు, కుటిలజనభంగ............ 14

సీ. కుంటెన లగువారి వంటి వర్తించుట తగదు కోవిదులకు దానఁ జెడరె
మాట నేర్పరి యంచు మనసిచ్చి మెలఁగిన నరులతో కొండెముల్ నమ్మబలికి
మిత్రుల నెడబాపి శత్రుత్వమును జూపి కార్యముల్ చెఱుపును గాదె చెనటి
గుణముకలాఁడని కూడ రానిచ్చిన తప్పు త్రోవలఁ బెట్టి ముప్పు దెచ్చు
నట్టి దుర్జనుమైత్రి నీ యవనిలోన, గలిగి యుండుట తగ దెప్డు ఘనమతులకు
సజ్జనులమైత్రి గోరరే సాదు జనులు, కుటిలజనభంగ.................. 15

సీ. కోఁతి చేతను బెట్టు కుసుమంబు దలపంగ పలుగాకితోనుండు పండితుండు
చిలువతో మెలఁగెడు చిఱుతకప్ప దలంప పలుగాకితోనుండు పండితుండు
చలిచీమ గమిలోన మెలఁగెడు సర్పంబు పలుగాకితోనుండు పండితుండు
పాదరసంబులో నీదులాడు పసిండి పలుగాకితోనుండు పండితుండు
గాన విబుధులు దుష్టులతోన మైత్రి, బాసియుండుట న్యాయంబు దోస మెఱిఁగి
కోవిదుల బుద్ధి చెఱుపఁడే కొండెకాఁడు, కుటిలజనభంగ.................. 16

సీ. మిత్రులవలె తారు మెలగుచు నుండియే హానిసేయుదురయ్య మానహీను
లట్టివారినిఁ జేర్చునట్టి వారికి నున్న గౌరవం బెల్లను గంగఁ గలయు
నమ్మి వర్తించెడు నరులకు ద్రోహంబు చేసిన నజ్ఞాన చేటు గాదె
మంచి పెద్దల నెంచి మనుచుండు వారెపో ధర్మాత్ములనుటకు తగిన వారు
కొండెముల చెప్పు మూర్ఖుల గోనము నెఱిఁగి, దూరముగ బారద్రోలుచు ధీరమతులు
మసలు చుండిన తమకీర్తి మాటు వడునె, కుటిలజనభంగ.................. 17

సీ. అన్న దమ్ములతోడ నత్త మామలతోడ తల్లిదండ్రులతో నితరుల తోడ
కలహించి సజ్జనుల్ గానంగ బడినచో కపట భక్తినిఁ జూపి గౌరవమును
పొందితి నంచు నుప్పొంగుచుండెడిధూర్తు చేర నీయగరాదు ధీరమతులు
గుణవిహీనులరైనకుటిల వర్తనులను దరిజేర్చువారి వర్తనము చెడదె
నీతిమాలినవారిని నేర్పుతోడ, తరుము చుండుట న్యాయంబు ధన్యమతులు
కొంపలను మాపఁ జూడరే కూళజనులు, కుటిలజనభంగ.............. 18

సీ. మేలైన వస్త్రముల్ మేన దాల్పఁగవచ్చు పరులచే నిందింపఁ బడకయున్న
కొంప లెందరివైనఁ గూలఁ ద్రోయఁగవచ్చు మానాభిమానముల్ మాయమైన
సతుల చెంతను జేరి సరస మాడగవచ్చు సిగ్గును విడియంబు బుగ్గిదైన
కొండెంబు చెప్పెడి గోనమె యుండఁగవచ్చు పరుల నిందలకు తా వెరవకున్న
నీతిమాలినవారెపో నెగడు చుంద్రు, వారి వెనువెంట దిరిగెడు వారలెల్ల
నీచు తాటను దూషింప నేరమానె, కుటిలజనభంగ.............. 19

సీ. సంఘసంస్కారంబు సలుపనెంచుటె కాని యింటిలోపలి రోత నెఱుఁగలేరు
నీతివాక్యంబుల నేర్చి చెప్పుటె కాని తమయవినీతులఁ దలఁపలేరు
పరులదుర్మార్గంబుఁ బాపఁ జూచుటెకాని తమదుర్గుణంబులఁ దఱుమలేరు
ఇతరులపోరాట నెత్తిఁగి తీర్చుటెకాని ఘాతుకవృత్తుల గడవలేరు
గీ. గొప్పవారల మంచును జెప్పువారు, సభలలో సామవాక్యముల్ చాటఁగలరు
కాని సద్వర్తనంబును బూనలేరు, కుటిలజనభంగ! సత్సంగ! కోటిలింగ! 20

సీ. ధర్మశాస్త్రంబుల మర్మ మెఱింగియు ఘాతుకులను బ్రోచు ఘనులు లేరె
సామవాక్యంబులఁ జక్కఁగాఁ బల్కుచు కన్నగాండ్రై యుండు ఘనులు లేరె
పరకాంతలను గూడఁ బాప మనుచుఁ జెప్పి కనబడ్డసతిఁ గూడు ఘనులు లేరె
త్రాగుపోతుఁదనంబు తగ దని బోధించి కల్లుసారా త్రాగు ఘనులు లేరె
గీ. నీతివాక్యంబులను నేర్చి నేర్పుతోడఁ, జెప్పుటకు పెద్దలే యైనఁ జెడుగుపనుల
వదలి జీవింప ఖలులకు వశమె తలప, కుటిలజనభంగ ............. 21

సీ. కారణములులేని కలహంబు గల్పించి యొరులతోఁ బోరుచు నుండుటయును,
కరుణలేకుండుట, కపటస్వభావంబు, పరవధూగమనంబు, పరధనంబు
నైకొనఁ జూచుట, కల్లలాడుటయును, త్రాగుపోతుతనంబు; తనివిలేమి;
పరుల మర్యాదయు బాటింపకుండుట, సజ్జనదూషణ, స్వజననింద,
గీ. తెలుపఁ దగనివేషంబును దాల్చుచుంట, యనఁగఁ బరఁగుచు నుండు నీయవగుణములు
మహాజనసామ్రాజ్యములు దుష్టసంఘమునకు, కుటిలజనభంగ............ 22

సీ. ముచ్చిమిసేయించి మాటలఁ దెప్పించి న్యాయమార్గంబున నడచువారు
గొంతులు కోయించి గొప్పదుస్తులు గాల్చి నీతుల బోధించి నెగడువారు
తగవులఁ గల్పించి ధనమార్జనము చేసి ధర్మాత్ము లనుపేరు దాల్చువారు
సమకూర్చి యుంచిన చందాల నెగబెట్టి పరహితకారులై ప్రబలువారు
గీ. తెలుపఁ దగనివేషంబులఁ దాల్చి కరము, పట్టణంబుల జనులకు బాధపెట్టి
బ్రతుకజూడరె యొరులకుఁ బట్టువడక, కుటిలజనభంగ............... 23

సీ. అందఱ మొక్కటే యని నమ్మవలె నన్న నసహానబుద్ధియె యాసహిల్లు
బీదల సమబుద్ధి నాదరింపఁగ నున్న పిసినిగొట్టుతనంబు కసరిగొట్టు
విద్యయు బుద్ధియు వెలయుచునుండినా గర్వంబు తలకెక్కి కదలనీదు
మరులు చిక్కఁగఁబట్టి మనసు నిల్పగనున్న పంచబాణుఁడు చాల ప్రల్లదుండు
గీ. మలఁగు వెనువెంట నెప్పుడు మరణకాంత, కాలచక్రవేగము భయంకరము గాదె
సమయు నెన్నఁడు దుర్గుణసమితి జగతి, కుటిలజనభంగ............ 24

# మానవసేవ.

సీ. ఇతరులదోషంబు లెన్నుచుండుట కన్న దనతప్పులను జూచుకొనుట మేలు
పెఱవారిమాటల బిఱుగు సేయుట కన్నఁ దనమాటలోఁ దప్పు గనుట మేలు
పరులవర్తనఁ జూచి బాగులేదనుకన్నఁ దనవర్తనముఁ జూచికొనుట మేలు
ఇరుగింటికలహంబు నెఱిఁగి నవ్వుటకన్నఁ దనయింటిపోరాటఁ దఱుమ మేలు
గీ. తమకుఁ గలయట్టి తప్పులఁ దా రెఱుఁగక, త్రుళ్ళిపడుచుందు రయ్యయో దుర్ణయాత్ము
లట్టివారిని దరిజేర్ప నర్హమగునె, కుటిలజనభంగ............... 25

సీ. కొందఱు యోగ్యుని కొఱగాఁ డనుచు నుండ జాలి లాలించు సజ్జనులు లేరె
కొండెకాఁ డితఁ డంచు కొందఱు పలుకంగ విని పాప మనుచుందు జనులు లేరె
మాయలాఁ డితఁ డంచు మఱి కొంద ఱని దూఱఁ బుణ్యాత్ముఁ డని పల్కు బుధులు లేరె
గుణవిహీనుఁ డటంచుఁ గొందఱు నిందింప నుతిసేయుచుందు పండితులు లేరె
గీ. మంచివారలఁ జూచి సహింపలేని, నీతిమాలిన కుమతుల నింద కేమి
సజ్జనులు మెచ్చవలె గాని సాధుజనుల, కుటిలజనభంగ............... 26

సీ. కమలినీపత్రసంగతజలబిందువు గతి చంచలంబు జీవితము సూవె
కాయము దలపోయఁగా రోగపీడితం బభిమానమునకును నాస్పదంబు
సంసార మన్ననో సకలపాతకముల నిలయంబు సుజ్ఞాననిందితంబు
లోకముఁ జూడఁగా శోకనిమగ్నంబు ఘోరదురాచారఘూర్ణితంబు
గీ. గాన సజ్జనసేవయే కరము చేయు, చుండవలయును దురితంబు లండఁ జేర
వట్టివారలె పుణ్యాత్ము లందు నిందు, కుటిలజనభంగ............... 27

సీ. కన్యలపంతువై కానఁబడు నటంచుఁ జిన్నిబాలల పెండ్లి సేయ నేల?
కన్నెప్రాయమునాఁడె కాంతలు ధవుఁ బాసి వైధవ్యమును పొంద వగవ నేల?
పొరుగువారలు చూచి పొలఁతియవస్థకుఁ జింతింపఁ గని సిగ్గుజెంద నేల?
కటకటా మనబాల కర్మ మీగతి నుండ నెవరివశం బని యేడ్వ నేల?
గీ. నిర్మలజ్ఞానమునకు సద్ధర్మమునకు, సకలసుఖనివహముల కాస్పదము గానఁ
జెలఁగి వయసునఁ బెండిలి సేయ రాదె, కుటిలజనభంగ............ 28

సీ. కొంకక గుజ్జనగూళ్లు మెక్కెడునాఁడె మగనిసయ్యాటల మరగవలసె
చిన్నారిపొన్నారిచిఱుతప్రాయమునాఁడె పిల్లతల్లులై పెరగవలసె
కూకటివేణితోఁ గరులు కూడనినాఁడె వైధవ్యమును బొంది వగవవలసె
అచ్చనగండ్లాట నాడుచుండెడినాఁడె దుఃఖవారాశిలో దుమకవలసె
గీ. పండితుల మంచు జెప్ప నీబాడబులకు, సిగ్గు లేకుంటచే నిట్టిచేటు గలిగె
ననదలై యున్న యబలల కనవరతము, కుటిలజనభంగ............ 29

సీ. తోడికాంతలతోడఁ గూడి పేరంటంబు సేయఁబోవుట లింక జెల్లె నాకు
ఘుమఘుమవాసనల్ గ్రమ్ముపుష్పంబుల ధరియించువేళలు తప్పె నాకు
మంచిచీరలు గట్టి మానాగు నుబిల్వఁ బోయి సేవించుట పోయె నాకు
మగఁడు చేరఁగ బిల్చి మల్లెలు సిగఁజుట్టు తరుణంబు లన్నియుఁ దరలె నాకు
ఎట్టు లోర్పుదు విరహార్తి నింకమీఁద, నెట్లు గడపుదు ప్రొద్దుల నింకమీఁద
ననుచు విలపించు విధవల యార్తి వినవె, కుటిలజనభంగ ! సత్సంగ ! కోటిలింగ ! 30

సీ. మనసులోపలి చింత మల్లడిగొనుచుండ దాచివేయఁగ నాతరముగాదు
పైకొన్న వలవంత బయలుపడుచుండ దాచివేయఁగ నాతరముగాదు
కొమిరెప్రాయంబునఁ గోర్కె లువ్విళులూర దాచివేయఁగ నాతరము గాదు
విరహార్తి నొందెడువేళ భావజుబాధ దాచివేయంగ నాతరము గాదు
పతిని బాసిన భామకు బ్రతుకదేల ? , ధవుఁడు లేనట్టి మగువకు ధన మదేల ?
యనుచు విలపించు విధవలయార్తి వినవె, కుటిలజనభంగ............... 31

సీ. అడవిని గాసినయట్టి వెన్నెల సుమ్ము పతిలేనిభామ యౌవనము దలఁప
వనమున వర్షించు వారివాహము గాదె చెలువుని బాసిన చేడెకోర్కె
కానసంబున బూయుఁ గమ్మసంపఁగి జువ్వె సుందరాంగుఁడు లేని సోయగంబు
కాంతారమున నుండు వింతఫలంబు సూ మగఁడు పోయిన సతి మంచితనము
ప్రాయమున నుండు సతులను పతులు బాయ,గలుగు దుఃఖంబునకు మేర గలదె దలఁప
ననుచు విలపించు విధవలయార్తి వినవె కుటిలజనభంగ........... 32

సీ. కురులు చక్కఁగ దువ్వి విరులు చుట్టగఁ జూచి తగ దని శోధించు తల్లి యొకతె
సరిగంచుచీరలు ధరియింపఁ గని చాలవగచి దూఱుచునుండు మగువ యొకతె
యీడువారలతోడ గూడి యాడెడువేళ పిలిచి నిందించెడు పొలతి యొకతె
పట్టెమంచముమీఁద పవ్వళించినయెడ నింతచే లేలను నింతి యొకతె
యెల్లవేళలఁ బీడింప నెట్టు లింక, బ్రతుకఁగలవారల మటంచు బలుకుచుండు
బాలవిధవల యిడుముల బాపవలదె, కుటిలజనభంగ................ 33

సీ. బాల్యవివాహముల్ పారదోలియు మమ్ము రక్షింపరే యను రమణి యొకతె
శాస్త్రవిద్యల నేర్పి జవరాండ్ర మౌఢ్యంబు బాపరే యని కుందు పడతి యొకతె
నిర్బంధవైధవ్యనిర్మూలనముచేసి కాపాడరే యను కలికి యొకతె
యశము పోగొట్టు కన్యాశుల్కముల మాని దాన మీయరె యను తన్వి యొకతె
గృహములం దుండి విలపింప నహరహంబు,జూచి సహియింపఁ జెల్లునే చులకఁజేసి
మాన మభిమానమును గల మనుజవరులు, కుటిలజనభంగ............ 34

సీ. కావ్యపాఠంబులు శాస్త్రసంగీతముల్ బోధించు గురువుల బుజ్జగించి
వైశేషికులు సేయు వ్యాఖ్యల వేదాంతవేద్యుల బోధల విని స్తుతించి
మాన్యవర్తనులైన మనుజులఁ దిలకించి సత్యసంపత్తికి సంతసించి
విజ్ఞానపుంజము లెన్నొ సేయుచునున్న పనివాండ్ర నేర్పును బ్రస్తుతించి
పరుషవాక్యధోరేయులఁ బనులుచేయుఁ, జేతగానివారల దరి జేరనీవె
కాలమొకరీతి నుండదుగాదె జగతి, కుటిలజనభంగ........................35

సీ. దయయు సత్యము శౌచధర్మంబుల నెఱింగి బ్రతుకువారలు కానబడుట లేదు
దేశభాషలలోనఁ దేజరిల్లి వినీతిగలిగిన మనుజులు కానరారు
పరకాంతలను తల్లిభాతిగా మదినెంచి సంచరించెడివారి సంఖ్య తరిగె
జంతుజాలములపై జాలిగల్గి చరించు ఘనసుమనస్కులఁ గాంచు టరిది
మాటనిల్కడలేనట్టి మానవులును, నాడితప్పెడువార లీనాడు గలరు
కాల మొకరీతి నుండదు గాదె జగతి, కుటిలజనభంగ.............. 36

సీ. చక్కనిసాహిత్యసంపద గల్గిన పండితవర్యులు పలుచబడిరి
అనుభవజ్ఞానులైనట్టి కవీశ్వరుల్ కనబడుదినములు గడచిపోయె
సన్ననికెంబట్టుసాలుల రచియించు నేర్పరు లాదలు నీల్గినారు
జీవకళలతోడఁ జెలఁగు విగ్రహముల నిర్మించు పనివాండ్రు నేలఁబడిరి
కష్టపడి జీవయాత్రను గడపనున్న, కూలిపని చేయువలయును కూటికొఱకు
కాల మొకరీతి నుండదు గాదె జగతి, కుటిలజనభంగ......................37

సీ. పరులపంచలఁ జేరి బ్రతుకరాదని చెప్పు శాస్త్రవినీతులు సమసిపోయె
పరులక్షేమము గోరి బ్రతుకుఁ డనుచు చెప్పు శాస్త్రవినీతులు సమసిపోయె
పరుల కగ్గొనరింపఁ బాప మనుచు చెప్పు శాస్త్రవినీతులు సమసిపోయె
పరులఁ బూజించుటే పరమార్థ మని చెప్పు శాస్త్రవినీతులు సమసిపోయె
పరులఁ బీడించి సతతంబు బ్రతుకువారు, పరుల యాచించువారలు ప్రబలినారు
కాలమొకరీతి నుండదు గాదె జగతి, కుటిలజనభంగ............. 38

సీ. చిత్రచిత్రములైన చీనిచీనాంబరములఁ జేయు నేర్పెల్ల మూల కొదిగె
చూడఁజూడఁగఁ గ్రొత్తసొంపు నాపాదించు చెక్కడంబుల ప్రౌఢి చెన్ను మాసె
వింతవింతలరంగు లెంతో హొయల్ జూపు చిత్తరువులకీవి శిథిలమయ్యె
కష్టంపుబనులైన గడియలో నెఱవేర్చు యంత్రనిర్మాణంబు మంత్రమయ్యె
పనులు చేయంగవలె నన్న పరికరములు, కొరుల యాచింపవలె నిప్పు డున్నవారు
కాల మొకరీతి నుండదు గాదె జగతి, కుటిలజనభంగ............. 39

సీ॥ చుట్టుగోడలు లేనియట్టి లోగిళ్లను బారుతీరిన యిండ్లపంక్తిఁ జూచి
చిగురుజొంపములతో జెన్నొందుపందిళ్ల ముందుభాగములుండు మురువుఁ జూచి
ఇంటింటికడ నెంతో యింపుగా విలసిలు కంపుసంస్తుతులను జూచి
అన్నమాటలఁ దప్పనట్టి ధర్మాత్ముల పాండిత్యసంపదపటిమఁ జూచి
నియమవృత్తులు లేని దుర్నీతిపరుల, తోడఁ గ్రీడింపుచుంటి వీనాడు నీవు
కాల మొకరీతి నుండదు గాదె జగతి, కుటిలజనభంగ సత్సంగ కోటిలింగ 40

సీ॥ అశ్వత్థవృక్షంబు లంపంప గన్పట్ట పల్లెసీమల సౌరు జూచి
పచ్చనిపందిళ్ల పసమీరి చక్కఁగా బారుతీరిన యిండ్లపంక్తిఁ జూచి
వేదశాస్త్రార్థవేత్తలు పండితుల్ శిష్యులు బోధించు నేర్పు జూచి
ప్రజలైకమత్యసంపద గల్గి విలసిల్ల లేపడిలేని పల్లియలఁ జూచి
చెప్పనడ నేల? నేను నీమెచ్చు బడయ, పరుల కపకారములు చేయు నరులు లేరె
కాల మొకరీతి నుండదుగాదె జగతి, కుటిలజనభంగ,.......... 41

సీ॥ ధర్మశాస్త్రపురాణతాత్పర్యవేత్తలై విలసిల్లుచుండెడి విప్రవరుల
వైరివీరుల కెంతవారైన దునుమాడి రాజ్యంబు లేలు రారాజవరుల
సకలవస్తువులతో సలుపు బేహారముల్ రాణనొప్పెడు కిరాటవరుల
కనులపండువుగాఁగ గన్పట్టు పైరుల గాపాడుచుండెడి కాపువాండ్ర
జూచి సంతసించిన నీవు చూడవలసె, కలుషకార్యధౌరేయుల గాపురుషుల
కాల మొకరీతి నుండదు గాదె జగతి, కుటిలజనభంగ........... 42

సీ॥ ఆలాపమున జాల నల్లన గరగింపు గాంధర్వమును నేర్చు ఘనులు లేరు
మధురస్వనంబులు మల్లడిగొనుచుండ మురళిగానము సేయు నరులు లేరు
సకలజంతువులకు సంతసంబును గూర్చు వల్లకి రవళించువారు లేరు
ధన్యులు మదిమెచ్చ తాళగతి మురజరవమునఁ జూపు సరసులు లేరు
శంఖములను బూరించెడు జనులు లేరు, సరసదేశీయవిద్యలు సమసిపోయె
కాల మొకరీతి నుండదు గాదె జగతి, కుటిలజనభంగ........... 43

సీ. వేదఘోషణలతో విలసిల్లు పురములు, పురముల గ్రీడించు వరసుమతులు
సుమతులు బోధించు సూనృతవాక్యముల్, వాక్యముల్ దప్పని వర్తనములు
వర్తనంబున నీతి బాటించు వటువులు, వటువులు వెన్నంటు వరసుకవులు
కవుల రక్షించెడు ఘనమహారాజులు, రాజు లేలెడి మహారాష్ట్రములును
గలిగి కన్నులపండువై కానబడెదు, దినములు గతించిపోయె నీదేశమందు
కాల మొకరీతి నుండదు గాదె జగతి, కుటిలజనభంగ............ 44

సీ. ఆకాశమండలం బవఘళింపఁగఁ జాలు కొత్తళంబులఁ గట్టు గొప్పతనము
పటుబలాఢ్యులు చేతఁ బట్టి యెత్తఁగలేని ఖడ్గముల్ నిర్మించు కౌశలంబు
కఱకువాల్వేటుల కందువారని యట్టి కవచంబులను చేయు గౌరవంబు
వాయువేగంబుతో వడి జని ఛేదించు గొఱికల నిర్మించు సరసతయును
భరతఖండనివాసుల ప్రబలకీర్తి వెలయఁజేసిన దినములు వెడలిపోయె
కాల మొకరీతి నుండదు గాదె జగతి, కుటిలజనభంగ............ 45

సీ. సకలశాస్త్రజ్ఞులు చక్కగానీతుల బోధించి మించెడు బుద్ధిబలము
సత్యసంపన్నులు సాహిత్యగరిమంబు నేర్చి వర్తించెడు నీతిబలము
నిర్మలహృదయులు ధర్మమార్గంబులఁ దప్పి చరింపని ధైర్యబలము
శాంతస్వభావులు సాహసంబును జూపి శత్రుసేనలఁ బట్టు శౌర్యబలము
భరతఖండంపుకీర్తిని ప్రబలఁజేయ, వెలయుచుండెడిదినములు వెడలిపోయె
కాల మొకరీతి నుండదు గాదె జగతి, కుటిలజనభంగ............ 46

సీ. అడవి నఱ్ఱాడెడునట్టి బెబ్బులినైనఁ బట్టి బంధించెడు బాహుబలులు
ఆఁకొన్న సింగంబు నవలీల సందిట సాహసంబున బట్టు శౌర్యనిధులు
కులపర్వతంబులఁ గూఁకటివేళ్లతోఁ బెకలింపగల్గిన పీనభుజులు
కొండలపైనుండు కోటగోడల నెక్కి శాత్రవులను బట్టు సాహసికులు
భరతఖండంపుకీర్తిని ప్రబలఁజేయ వెలయుచుండెడిదినములు వెడలిపోయె
కాల మొకరీతి నుండదు గాదె జగతి, కుటిలజనభంగ............ 47

సీ॥ మచ్చికపడునట్లు మాయమాటలఁ జెప్పి పరధనంబులఁ గొంచు బ్రతుకువారు
పూర్వార్జితములైన భూముల తెగనమ్మి కూటసాక్ష్యములకై కుందువారు
కడుపుకూటికొరకు కన్నకూతుల నమ్మి పాపులై యగచాట్ల బడెడువారు
కష్టపడి ధనంబు గడియింపగా లేక నీచకార్యంబుల నేర్చువారు
చెడుగుపనుల నాసక్తితోఁ జేయువారు, పట్టణంబులఁ బల్లెలఁ బ్రబలినారు
కాల మొకరీతి నుండదు గాదె జగతి, కుటిలజనభంగ! సత్సంగ! కోటిలింగ! 48

సీ॥ పరకాంతలను జూచి పరులు గొనెడువారు, పరధనంబుల కాసపడెడువారు
పరపీడనముచేయ పరుగులెత్తెడువారు, పరులఁ జూచిన గోతపడెడువారు
పరుల సంరక్షింపఁ బాప మనెడువారు, పరులభాగ్యము జూచి వగచువారు
పరుల బాధించుటే పరమార్థ మనువారు, పరులమానము భంగపరచువారు
పారుబోతులు దుష్టులు పాపమతులు, పట్టణంబులఁ బల్లెలఁ బ్రబలినారు
కాల మొకరీతి నుండదు గాదె జగతి, కుటిలజనభంగ ... ... ...49

సీ॥ చెప్పెడిమాటలు చేసెడిచేష్టలు నొక్కటేతీరున నుండువారు
కష్టపడి ధనంబు గడియించి కూటికై పరుల యాచింపక బ్రతుకువారు
పరులకు గల్గిన బాధలఁ దలపోసి తమకు గల్గినయట్లుఁ దలచువారు
దుర్మార్గవృత్తులఁ దూఱువారలఁ జేరి నీతివర్తనమును నేర్పువారు
బీదవారల దరిచేరి ప్రీతితోడ, నాదరించెడి సజ్జను లరిగినారు
కాల మొకరీతి నుండదు గాదె జగతి, కుటిలజనభంగ ... ... ...50

సీ॥ ఒకనాఁడు భోజనం బొదవ సంతసపడంది, తిననిండి లేకున్న దిగులుపడఁడు
ఒకనాఁడు సుఖపడ్డ నుబ్బి వేరొకనాఁడు కష్టంబు లుండిన కందబోఁడు
ఒకనాఁడు పూసెజ్జ లుండిన శయనించి తాలిసేలలఁ జూచి మాలిముడుక
డొకనాఁడు సంపద లుండ గర్వముజూపి లేమి గల్గిననాఁడు క్లేశపడఁడు
సుఖమును దుఃఖమును సమముగా జూచుచున్నండి, తలఁచుపని విర్వహింపఁగఁ దషుక్షములు
కార్యసాధకుఁడైన సంఘాభిమాని, కుటిలజనభంగ ... ... ... 51

సీ॥ పాయసాన్నముఁ దినుభంగి భక్షించుబో కష్టదినములందు గంజికూడు
ధవళాంబరంబులు తాల్చిన ట్లెంచుబో పఁలిసవస్త్రము గట్టి మసలువేళ
పూలతోఁటలకుఁ దాఁ బోయిన ట్లెంచుబో వనములలో నుండవలసె నేని
హంబట్టుపరుపుపై నొఱగిన ట్లెంచుబో పచ్చికబయళులఁ బవ్వళింప
కాని ధైర్య మావంతయు గదలనీక, తలఁచుపని నిర్వహింపంగఁ దమకమందు
కార్యసాధకుఁడైన సంఘాభిమాని, కుటిలజనభంగ ... ... ... 52

సీ॥ కాంతారసీమల కడగండ్లఁ బడుచున్న, తోడివారలు తన్ను దూఱుచున్న
సకలకష్టములును సాగనీయకయున్న, కూళలు వెన్నంటి కొసరుచున్న
బంధుగులందఱు నింద సేయుచునున్న, దారిద్ర్యదేవత తన్నుచున్న
మిత్రులు దరిఁజేరి మేలుమే లనకున్న, కార్యసాఫల్యంబు గలుగకున్న
తగనిపని బూని తంచు నధైర్యపడక, తలఁచుపని నిర్వహింపంగఁ దమకమందు
కార్యసాధకుఁడైన సంఘాభిమాని, కుటిలజనభంగ ... ... ... 53

సీ॥ దేశీయు లందఱు దెల్విఁ గాంచగ నెంచు, చేతిపనుల పెంపు సేయ నెంచు
సంఘదౌర్బల్యంబు సాగదోలఁగ నెంచు, దుష్టవర్తనమును దోల నెంచు
పాండిత్యవిభవంబు పాదుకొల్పఁగ నెంచు, పతితుల దుఃఖంబు బాప నెంచు
ఆర్తజనంబుల నాదరింపఁగ నెంచు, స్త్రీలకు విద్య బోధింప నెంచు
జాతిగుణభేదముల పొంత జనుట మాని, తలఁచుపని నిర్వహింపఁగ తమక మందు
కార్యసాధకుఁడైన సంఘాభిమాని, కుటిలజనభంగ ... ... ... 54

సీ॥ ఆఁకొన్న వేళల నాహరింపఁగ లేమి బాధ జెందఁడు కార్యసాధకుండు
తోడివారలఁ గావ దూరదేశము లేగ సరకుగొనఁడు కార్యసాధకుండు
పరులబాధల మాన్ప ప్రాణహానియె యున్న సంశయింపఁడు కార్యసాధకుండు
బలహీనమగు వేళ పనుల సాధింపంగ సంభ్రమింపఁడు కార్యసాధకుండు
దయయు సత్యము శౌచంబు ధర్మపముధ, సజ్జనావళిగోష్ఠియు సంతరించి
జడుపు విడనాడుబో కార్యసాధకుండు, కుటిలజనభంగ ... ... 55

సీ. మకరందమును జిమ్ము మల్లెపూగుత్తుల గొంగళిపురుగులు కొఱుకునట్లు
మధురంబులైన క్రొమ్మామిపండులయందు చిన్నచీమలు చేరి చెఱుపునట్లు
కెందమ్మిపూవుల చిందు మరందంబు తేనెటీఁగలు మూఁగి తివుచునట్లు
పోహణించినయట్టి పూలహారము జూచి వానరంబులు త్రుంచివైచునట్లు
పరమపావను లగువారి పజ్జ జేరి, సద్గుణంబుల గ్రహియింపఁజాలనట్టి
దుష్టజనము లాపాదించెఁ దుర్గుణముల, కుటిలజనభంగ సత్సంగకోటిలింగ!...56

సీ. చెవుల కింపుగఁ బల్కుచిల్కలఁగని జాలిగల్గి లాలించునే గండుపిల్లి
నెమిలి పింఛమువిప్పి నీటు జూపు నటంచు విడిచిపుచ్చునె గాంచి వేఁటకాఁడు
కన్నుల కింపుగా గన్పడు శేళ్లను గని బ్రోచునట్టిసింగంబుగలదె
గోవులఁ దిలకించి కోపంబు జెందక ప్రేముడి జూపునే పెద్దపులులు
సజ్జనులఁ జూచి దుష్టులు సంతతంబు, హానిసేయంగ నెంతురు గాని వారు
చేయు బోధల వినఁగ నాశింపఁగలరె, కుటిలజనభంగ! ... ... ... ... ... 57

సీ. సన్మార్గవర్తులై సంచరించెడివారి దుష్టజనులటంచు దూఱుచుండు
నీతికోవిదులకై నెగడుచుండెడివారి పగమనీచులటంచు బలుకుచుండు
సకలశాస్త్రిజ్ఞానసంపత్తిగలవారి జ్ఞానశూన్యులటంచు జాటుచుండు
శాంతిస్వభావుల సత్యసంధుల జూచి క్రూరులనుచు తిట్టికొసరుచుండు
మంచివారిని జూచి సహించలేని, దుష్టకార్యధారేయుఁడు దుర్జనుండు
వానరము పూలతావుల వలచునెక్కొ, కుటిలజనభంగ! ... ... ... ... 58

సీ. సిరిమించు నునుపట్టు సెల్లాల దాల్చిన, వాహనంబులు గల్గి వరలుచున్న,
తలకొని ధీవరు తలదన్నఁజూచిన, ధనధాన్యసంపత్తిఁ దనరుచున్న,
భోగభాగ్యంబుతోఁ బొంగుచునుండిన, సంపదున్నతికి గర్వింపుచున్న,
మేడలు మిద్దెలు మెండుగా గల్గిన, పెంబట్టు పరుపుల నెరగుచున్న,
చేరి గోవిందుభజనల సేయుచున్న, తోడరి దీనులఁ గావని దుష్టబుద్ధి,
బ్రతికియుండియుఁ జచ్చినభంగి కాదె, కుటిలజనభంగ! ... ... ... ... 59

సీ. కల్లలాడించుచు కపటాత్మగాఁ జేయు, పరులఁ జూచిన రోఁతపడఁగఁజేయు,
దొంగతనము మప్పు దుర్వర్తనము జెప్పు, నీచకార్యము చేయ నేర్పు జూపు,
సజ్జనులగువారి సద్దచేయఁగనీదు, మంచిచెష్టలు విసర్జించనీదు
పాత్రయాచకులను బారఁదోలించుచు పరమదుర్మార్గుల ప్రాపుఁ జూపు
నిదియునదియని జెప్పగా నేలయింక, మంచిపనిఁ జేయనియ్యదు మఱచియేని
నట్టిలోభంబు విడనాడ రవని జనులు, కుటిలజనభంగ!... ... ... ... ...60

సీ. సాధుజనంబుతో సలుపు పోరాటంబు కుటిలవర్తనుఁడైన కొండెకాఁడు
పరమపావనులను పాపాత్ము లని దూఱు కుటిలవర్తనుఁడైన కొండెకాఁడు
మంచివారికి కీడు మాటిమాటికి సేయు కుటిలవర్తనుఁడైన కొండెకాఁడు
తానెపండితుఁడని తలఁచినిందించును కుటిలవర్తనుఁడైన కొండెకాఁడు
గాన దుష్టులతో మైత్రి కలలనైన, దలఁప గారాదు పండితుల్ దాని నెఱిఁగి
కొండెకాండ్రను దఱుముచునుండవలయు, కుటిలజనభంగ!... ... ... ...61

సీ. విత్తమార్జించెడు వేళ మావాఁడని చనవుజూపరె బంధుజనులు చేరి
ధనము గల్గిననాఁడు తమకు చుట్టమటంచు జాలి లాలింపరే సరస నుండి
సంపద గలనాఁడు సఖులు చుట్టములును ప్రేమతో జూడరె పెద్దజేసి
భాగ్య ముండిననాఁడు పరమపావనుఁ డని చాటుచునుండరే సభలలోన
లేమి గలనాఁడు దరజేరి లేశమైన, సాయ మొనరింపఁ డొక్కఁడు, సఖుల మంచు
చెప్పుకొనువార లానాఁడు చేరరారు, కుటిలజనభంగ!... ... ... ... ... 62

సీ. శునకంబు పుల్లె జూచినవెంట నే బోయి కడుపాఱ నాకదే కాంక్షదీర
ఖరము బూడిదఁ జూచి కడు సంతసమునంది పొరలి సుఖింపదే భోగ్య మనుచు
పంది బురద జూచి పరితుష్టినొందదే భాగ్య మబ్బినయట్లు భావమందు
కుక్కుటంబులు పెంటకుప్పలఁ బవళించి భావింపవే పట్టుపాన్పు లనుచు
దంశములు పుండ్ల జూచిన తమకపడవె, చెప్ప నేటికి దుర్జనచేష్టితముల
మందుఁ దేరీతిఁ జేయుఁబో మంచిపనులు, కుటిలజనభంగ!... ... ... ... ...63

సీ. దయగల్గి యుండేత దానంబులిచ్చుట, సత్యసంభాషణ సలుపుచుంట
భుజబలసంపత్తిఁ బొల్పారుచుండుట, వినయాదిగుణముల వెలయుచుంట
సద్వర్తనముఁ బూని చరియించుచుండుట, పరుల దూషింపక బ్రతుకుచుంట
నిర్మలవృత్తిమై నీతిగా మనుచుంట, ధర్మమార్గంబును దప్పకుంట,
మానవులమనోవీథుల మసలినట్టి, దినములు గతించిపోయె నీదేశమందు
కాల మొకరీతి నుండదు గాదె జగతి, కుటిలజనభంగ! సత్సంగ! కోటిలింగ! 64

సీ. కాయగూరలఁ దాము కడుపారఁ దినువారు మాంసాశనంబుల మరిగినారు
స్నానసంధ్యాద్యనుష్ఠానంబు గలవారు క్రూరవృత్తుల వారితేటినారు
విద్వాంసులై చాల వినుతికెక్కినవారు బంట్రోతులలోన ప్రబలినారు
సత్యశౌచాదుల సలుపనుండెడివారు దుష్టమార్గంబులఁ దూటినారు
వేదశాస్త్రసంవేద్యులై వెలయువారు, తప్పుసాక్ష్యంబు లీయంగఁ దలఁచినారు
కాల మొకరీతి నుండదుగాదె జగతి, కుటిలజనభంగ ... ... ... ... ... 65

సీ. అనుదినంబును విందు లారగింపఁగఁ జేసి భాగ్యవంతులపొత్తు బడయువారు
ఋణముచేసియునైన నీటుగా దుస్తుల ధరియించి బండ్లెక్కి తిరుగువారు
తనకీవి నొరులకైఁ గనఁబరుపఁగ నెంచి బీదవారల నాజ్ఞ పెట్టువారు
ఆశార్థులై వచ్చు యాచకజనులపై నుద్యోగగర్వంబు నూఁదువారు
పాపముఁ జేయ సంకోచపడనివారు, పట్టణావళిలోఁ జాలఁ బ్రబలినారు
కాల మొకరీతి నుండదుగాదె జగతి, కుటిలజనభంగ ... ... ... ... ...66

సీ. కాయకష్టంబున గడియించి తనవారి పోషింపఁ జకోవలేని పురుషుఁ డొకఁడు
సన్మార్గవృత్తిమై సతి సుతనిచయంబు మనుపఁగాఁజాలని మనుజుఁ డొకఁడు
శ్రీమంతులగువారు చేయుదానము జూచి సహియింపఁగాలేని జడుఁ డొకండు
పరులకష్టంబులఁ బారదోలెడువారి బాధింపఁగాఁ జూచు భ్రష్టుఁ డొకఁడు
సంతతము శాంతమూర్తులసరసఁ జేరి, క్రూరబుద్ధు లాపాదించి నేరమొంచి
కఠినహింసల పాల్జేయఁగాఁ దలంత్రు, కుటిలజనభంగ ... ... ... ... ... 67

సీ. ధనముగల్గినవాఁడు ద్రాఁగుబోతైనను బుద్ధికలాఁడని పొగడుచుంద్రు
భాగ్యముండినవాఁడు పాపాత్ముఁడైనను సన్మార్గుఁడని వాని జాటుచుంద్రు
శ్రీమంతుఁడగువాఁడు చెనఁటియై మెలఁగిన ధర్మతత్వగుఁడని తలఁచుచుంద్రు
రొక్కముండినవాఁడు రోఁతపనులఁజేయ గుణవంతుఁడని చెప్పి కులుకుచుంద్రు
మాయవేషంబులను వేసి మమతఁ జూపి, భాగ్యవంతులపంచల బ్రతుకునట్టి
బుద్ధిమాలిన సోమరిపోతు లెపుడు, కుటిలజనభంగ ... ... ... ... ... 68

సీ. భాగ్యవంతులటంచు పలుకుచుందురు కాని పిడికెడుబిచ్చంబు పెట్టలేరు
ధర్మతత్వగులంచు తలఁచుచుందురు కాని కడగండ్లఁబడువారిఁ గానలేరు
సత్యసంధులటంచు జాటుచుందురు కాని ఋజుమార్గవర్తన నేర్వలేరు
నీతిమంతులటన్న ఖ్యాతిగాంతురు గాని దుర్నీతిమార్గంబు తొలఁగలేరు
దుర్నయులు మీఱలుంగక త్రుళ్లిపడుచు, పైపటాటోపముఁజూప బయలుపడ్డదె
వారికడ నుందునట్టి దుర్వర్తంబు, కుటిలజనభంగ ... ... ... ... ... 69

సీ. విద్యచేతను జాల వెలయుచునుండిన వర్జింపఁ దగువాఁడు దుర్జనుండు
వెలలేనిసంపద విఱ్ఱవీఁగుచునున్నఁ వర్జింపఁ దగువాఁడు దుర్జనుండు
భక్తితత్పరతతోఁ బరుల బూజించిన వర్జింపఁదగువాఁడు దుర్జనుండు
తేనెలూరఁగ నోటఁ దియ్యనిమాటాడ వర్జింపఁదగువాఁడు దుర్జనుండు
కార్యసాధనమునకునై కపటవృత్తి, బూని చరియించువేళల బుద్ధిమంతు
లనఁగఁ గనఁబడుచుంద్రు దుర్జనులు జగతి, కుటిలజనభంగ ... ... ...

సీ. సారస్వతాంబోధి సంచరింపఁగనున్న సద్గుణం పెనుతెప్ప నపహరించి
గడితేరవలయును గాని యూరక శాస్త్రపరిచయం బబ్బునే పామరులకు
నిర్మలసలిలంబు నిశ్శేషపద్మంబులై విరాజిల్లు సరోవరంబుఁ
జొత్తెంచు మహిషంబు సుకముగా నుంపక పద్మాకరంబును పాడువార
జేసి పంకిలమై యొద్దు చేరునట్లు, గురులకడ విద్యనేర్వని కూళజనులు
భాష దుర్మలినంబుగా జేసి చెడరె, కుటిలజనభంగ ... ... ... ... ... 71

సీ. ధర్మాత్ములగువారిఁ దా గౌరవింపఁడు, కుజనులదరిఁ జేరి కులుకుచుండు
నీతికోవిదులను నిరసించుచుండును, బుద్ధిమాలినవారిఁ బొగడుచుండు
శాంతచిత్తులఁ జూచి సతతంబు దూఱును, కాపురుషులఁ జాల గౌరవించు
నిర్మలహృదయుల నిందసేయుచునుండు, మలినమనస్కుల మదిని మెచ్చు
కోవిదులగోష్ఠి చెవిఁ బెట్టఁ గుందుచుండు। మంచిపని జేయువారల మాట జెప్ప
మండిపడుచుండు పండితంమన్యుఁ డెపుడు। కుటిలజనభంగ సత్సంగ కోటిలింగ 72

సీ. దిశలఁ గన్గొనువేళ దిశలఁ గన్గొనుచుండు, నడచుచునుండిన నడచుఁ దాను
రెక్క విదల్చిన రెక్క విదల్చును, పవ్వళించినయెడఁ బవ్వళించు
వింతఁ జూపెడువేళ వింతఁ జూపుచునుండు, నాహరింపుచునున్న నాహరించు
సొగసుజూపెడుతరి సొగసుజూపుచునుండు, మొగముద్రిప్పుచునున్న మొగముద్రిప్పు
కాని పంజరమునఁ జిల్క కంఠ మెత్తి। పలుకువేళలఁ గ్రీనీడ పలుకఁగలదె?
చెప్ప నేఁటికి మూర్ఖులచిత్తవృత్తి?। కుటిలజనభంగ ... ... ... ... ... 73

సీ. పరుల బాధలఁ బెట్టి బ్రతుకుచుండుటకంటె, కష్టార్జితం బొక్కగవ్వ మేలు
పరుల యాచించిన పాయసాన్నముకంటె, కూలి నబ్బిన గంజికూడు మేలు
పరపీడనముఁ జేయు ప్రాభవంబునకంటె, బాధపెట్టని బీదబ్రతుకు మేలు
పరుల హింసించి సత్తురువుఁ బెట్టుటకంటె, కుడిచి కూర్చుండుట కొంత మేలు
దుర్నయులు మీ దెఱుంగక త్రుళ్లిపడుచు। కష్టపడి జీవయాత్రను గడపలేక
సిగ్గుమాలినపనులను జేయు టరుదె?। కుటిలజనభంగ ... ... ... ... 74

సీ. కాషాయవస్త్రంబుఁ గట్టి వర్తించిన, పట్టెనామంబులఁ బెట్టుకొన్న
జపమాలఁ జేఁ బూని సవరించుచుండిన, మెయినిండ భస్మంబు మెత్తుకొన్న
స్నానసంధ్యాద్యనుష్ఠానంబు లుండిన, వేదాంతవేత్తయై వెలయుచున్న
ప్రామిడి యెన్నియో పాతకంబులఁ జేసి, పరమభక్తుం డనఁబడెడు చెనఁటి
పరుల కపకారములు చేసి బ్రతుకుచుండి। పైపటాటోపములఁ జేయు, బాదుకొన్న
పరమదుర్మార్గవృత్తుల బాయఁగలఁడె। కుటిలజనభంగ ... ... ... ... 75

సీ. విద్వాంసులును తత్వవిదులు శాస్త్రజ్ఞులు జ్ఞానసంపన్నులు [illegible]
లధ్యయనపరు లధిక బలాఢ్యులు సకలలోకజ్ఞానచతురమతులు
పరమధార్మికులును భక్తితత్పరులును కరుణాంతరంగులు వరసుమతులు
పరులకు నీతులఁ గఱపుచు నెక్కుడుగ విహరింపుచుండుదు రహరహంబు
నందు నొక్కరుఁడైనఁ దా ననవరతము। నితరులకు చెప్పునట్టుల మతిఁదలంచి
మెలఁగునో లేదొ యననేల మేఁటిసుగలు। కుటిలజనభంగ ... ... ... 76

సీ. పరలోకసౌఖ్యంబుఁ బడయఁగావలె నంచు, గోరి తపము జేయఁ గొన్ని నాళ్లు
సకలతీర్థంబుల సందర్శనమునఁ జేకూరు పుణ్యం బని కొన్ని నాళ్లు
సకలాగమజ్ఞానసార మెఱుంగుటే పున్నె మనుచు నెంచి కొన్ని నాళ్లు
సజ్జనావళిసేవ సతతంబుఁ జేయుచోఁ గూడు స్వర్గం బని కొన్ని నాళ్లు
మానసంబులఁ దలపోసి మరుగనేల?। ధర్మసత్యశౌచంబులఁ దాల్చి నరులు
కష్టపడి జీవయాత్రను గడపరాదె। కుటిలజనభంగ ... ... ... ... ... 77

సీ. కడగండ్లఁ బడువారిఁ గాపాడవలె నంచు మదిలోనఁ దలపోసి మరుగుచుండు
దిక్కుమాలినవారి నెక్కుడుదయతోడ, నాదరింపఁగ నెంచు ననవరతము
వికలాంగులను జూచి వెతఁజెంది సతతంబు కరుణమై గాఁపాడ పరువులెత్తు
బలవిహీనులకెపుడఁ బరమాదరముఁ జూపి యురుబలాఢ్యులఁ జేయ నుత్సహించు
పరుల బాధలఁ దొలఁగింపఁ బాటుపడును। జాతిమతభేదములపొంతఁ జనుట మాని
కరుణ గలిగివర్తించెడు నరుఁడు జగతి। కుటిలజనభంగ... ... ... ... 78

సీ. బాల్యంబునం దాటపాటల నాసక్తి గలిగి వర్తింతురు తెలివిమాలి
తరుణప్రాయంబునఁ దరుణులపై నాసఁ జెంది క్రీడింతురు సిగ్గుమాలి
కౌమారదశయందు కడగండ్లఁ బడలేక కుందుచునుందురు మందబుద్ధి
బ్రదికియుండినవేళ బ్రహ్మంబు నెఱుఁగక చచ్చుచునుంద్రు దుర్జనులు జగతి
ధర్మసత్యశౌచంబులఁ దాల్చియుంట। జీవితమునకు పరమార్థచింత యనుచు
తెలిసి వర్తించువాఁడె పుణ్యచరితుఁ డౌను। కుటిలజనభంగ ... ... ... 79

సీ. సకలవిద్యారహస్యముల నేర్వఁగ లేదు, వినయాదిగుణముల వెలయ లేదు
నీతివర్తనుఁ డన్న ఖ్యాతిఁ బొందఁగ లేదు, ధర్మస్వరూపంబు దాల్ప లేదు
పుట్టినదేశంపుఁగట్టు గానఁగ లేదు, ఐశ్వర్యసంపత్తిలోఁ దనర లేదు
పరులకష్టంబులఁ బారఁదోలఁగ లేదు, తనువిచ్చి దేశంబు గాంచ లేదు
జన్మ మెత్తిన దాది నా శక్తికొలఁది నవదలకు దోఁడునూప లే దనుచు, దలఁచి
మదిని విలపించు దేశాభిమాని సుపురుషు. కుటిలజనభంగ ... ... ... ... 80

సీ. సర్వభూతములకు సాక్షియై వెలుఁగుచు, నీషణత్రయమున నీఁదుచుండు
బ్రహ్మాండ సంతతుఁ బ్రజ్వరిల్లుచు నుండి, సూక్ష్మదేహంబునఁ జొచ్చియుండు
తనయందు సకలభూతములు పుట్టుచునుండ, భౌతికదేహంబు బడయుచుండు
నానందరూపమై యలరారుచుండియుఁ, గ్రోధమోహంబులఁ గూలుచుండు
నౌర! మాయాప్రవర్తితంబైన యాత్మ! చిన్మయం బయి దేహంబు చెడినపిదప
నాదిమధ్యాంతశూన్యమై యలరుచుండు. కుటిలజనభంగ ... ... ... ... 81

సీ. విజ్ఞానవనవాటి విహరించి యుపనిషద్ఫలరసంబుల గ్రోలి బ్రతుకువారు
సురుచిరకీర్తిప్రసూనంబుఁ దాల్పంగ నీతిమార్గంబుల నెపువారు
విమలసత్యవ్రతావిర్భూతసౌరభపుష్పదామంబులఁ బూనువారు
సంఘాభివృద్ధిసంస్కారకృత్యములు నా మీఱు జొంపములలోఁ దూఱువారు
పాటుపడి జీవయాత్రను బగటువారు, జనులక్షేమంబుఁ గోరుచు జరుగువారు
చేయఁదగినది మానవసేవ గాదె. కుటిలజనభంగ ... ... ... ... ... 82

సీ. భాషాభిమానంబుఁ బడయఁగావలె నన్న, నీతిమార్గంబుల నెమకనున్న
సంఘసంస్కారంబు సలుపగావలె నన్న, పరులసౌఖ్యముఁ గోరి బ్రతుకనున్న
నీచజాతుల వృద్ధి నెఱపఁగావలె నన్న, దుష్టమార్గంబులఁ దోలనున్న
దారిద్ర్యదేవతఁ దఱుమగావలె నన్న చేతిపనులఁ బెంపుసేయనున్న
కర్మవిద్యాలయంబులఁ గట్టనున్న. పతితులై సంతతము కష్టపడెడువారు
చేయఁదగినది మానవసేవ గాదె. కుటిలజనభంగ ... ... ... ... ... 83

సీ. గ్రుడ్డివార మటంచు కుంటివార మటంచు వీధుల యాచించి విసుగువారి
గుడ్డలు లే వంచు కూడు లే దనుచు నెల్లపుడుఁ గుందుచు నుండునట్టివారి
కడుపు మాడెడు నంచు కాళ్ళు లాగు నటంచు నడచుచు వీధుల నరుగువారి
పడరానికష్టముల్ పడుచుండి దిన మొక్కయేడుగా మది నెంచి యేడ్చువారి
దీనజనులను జ్ఞానవిహీనజనుల నుద్ధరింపంగవలె నన్న బుద్ధి గలిగి
చేయఁదగినది మానవసేవ గాదె। కుటిలజనభంగ ... ... ... ... ... 84

సీ. దుష్టబుద్ధి యటంచుఁ దొలఁగఁ ద్రోయుటకన్న చేరఁదీయుచు బాగుచేయ మేలు
నీతిమాలినవారి నింద సేయుటకన్న మంచిమార్గముఁ జూపి మనుప మేలు
అనృతవాదు లటంచు నపహసించుటకన్న సత్యసంధులఁ జేయఁ జాల మేలు
త్రాఁగుఁబోఁతు లటంచు సాఁగఁదోలుటకన్న నీతివర్తనమును నేర్ప మేలు
సంస్కరించెడువారె పో సత్యవంతు। లట్టివారల మార్గంబు ననుసరించి
చేయఁదగినది మానవసేవ గాదె। కుటిలజనభంగ ... ... ... ... ... 85

సీ. బ్రహ్మాండ మంతట ప్రజ్వరిల్లుచునుండి మానసవీధిలో మసలు నెద్ది
అణురూపమును దాల్చి యనవరతంబును చావు పుట్టుక లేక జరుగు నెద్ది
పుత్రమిత్రకళత్రశత్రుభావంబున దేహగేహంబులఁ దిరుగు నెద్ది
తనవారి పెరవారి తారతమ్యముఁ జేసి శత్రుమిత్రత్వంబు సలుపు నెద్ది
ఆదిమధ్యాంతశూన్యమై యలరు నెద్ది। యట్టి పరమాత్మ నిత్యవకా టంద తెలిఁగి
చేయఁదగినది మానవసేవ గాదె। కుటిలజనభంగ ... ... ... ... ... 86

సీ. భూమధ్యమంబును బొందియుండిన దెద్ది, జలమయంబునను ప్రజ్వరిల్లు నెద్ది
సకలభూతములకు సాక్షియై నిత్యమై నాశరహితమైనట్టి దెద్ది
జాతిభేదము లేక జరుగుచుండెడి దెద్ది, కలిమిలేములు లేక గ్రాలు నెద్ది
ఆనందరూపమై యలరుచుండెడి దెద్ది, విమలవిజ్ఞానమై వెలయు నెద్ది
అట్టి పరమాత్మ నిత్యవకా టంద తెలిఁగి। దయయు సత్యము శౌచంబు దాల్చి కరము
చేయఁదగినది మానవసేవ గాదె। కుటిలజనభంగ ... ... ... ... ... 87

సీ. దుర్బలు రగు వారి దుర్భరమగు జీవయాత్ర సౌఖ్యంబుగా నడుపుకొనుట
రోగపీడితుల నారోగ్యులుగాఁ జేసి పరులబాధల మాన్పి బ్రతుకుకొనుట
కరుణావిహీనులఁ గరుణాంతరంగులఁ గావించి కాలంబు గడపుకొనుట
దుష్టచిత్తుల జ్ఞానతుష్టచిత్తులఁ జేసి పరమశాంతంబును బడయుకొనుట
సజ్జనావళిసద్గోష్ఠి సలుపుకొనుట। వివిధకార్యధారేయులై వెలయుకొనుట.
చేయఁదగినది మానవసేవ గాదె। కుటిలజనభంగ ... ... ... ... ... 88

సీ. సకలజంతువులకు చావు నైజం బని తెలిసియు మనుజులు తెలివిమాలి
చచ్చినవారికై చాల దుఃఖింపుచుఁ గాలంబు వృథసేయఁ గార్య మగునె?
చెడదేని దేహంబు చెడుఁగాని జీవుండు చెడ డంచు నెంచి నిశ్చింతమతిని
బ్రతికియుండినవేళ పాటుపడుచు మేలు సేయవలయు గాదె చింతదక్కి
సకలజనములు తమవారె చర్చసేయ। గాన నరులకు సౌఖ్యంబు గలుగుకొనుట
చేయఁదగినది మానవసేవ గాదె। కుటిలజనభంగ ... ... ... ... ... 89

సీ. నీఁటిలోఁ జెట్లక్రీనీడ గన్పడురీతి దేహి దేహములందుఁ దేజరిల్లు
నఖిలప్రపంచంబునందు నిండినశక్తి సర్వదా మనలోన సంచరించు
సకలభూతములకు సాక్షియై నిలిచిన పరమాత్మ మనయందు పరిఢవిల్లు
పంచభూతంబులు పరమాత్మరూపమై దేహగేహంబులఁ దిరుగుచుండు
జాతిగుణభేదములు లేక చావులేక। వెలుఁగు దేహికి నాశంబు గలుగదనుచు
దలఁచు సుజ్ఞాను లందఱు తరలినారు। కుటిలజనభంగ ... ... ... 90

సీ. విద్యాలయంబుల వెలయఁజేయుట, చేతిపనులవృద్ధికొనకు పాటుపడుట
కుంటివారలకును గ్రుడ్డివారలకును నన్నవస్త్రము లిచ్చి యాదుకొనుట
కఱవుకాలంబున కడగండ్లఁ బడుచుండు మనుజుల దయతోడ మనుచుచుంట
పాత్రయాచకుల నపారకరుణఁ బ్రోచి ధనవిహీనులఁ బ్రీతిఁ దనుపుచుంట
తమకు విధియని తలఁచెడు ధనికులెల్ల। కానఁబడుచుండు దినములు గడచి పోయె
కాల మొకరీతి నుండదు గాదె జగతి। కుటిలజనభంగ ... ... ... 91

సీ. చదువుల నేర్చిన జవరాండ్రు పెక్కండ్రు కనఁబడు దినములు గడచిపోయె
నీతికోవిద లైన నెలఁతలు ధర్మంబు గాపాడు దినములు గడచిపోయె
శాస్త్రచర్చలఁ జేయు జలజాక్షు లెల్లెడ కర మొప్పు దినములు గడచిపోయె
విల్లు నమ్ములుఁ బూని వెలఁదులు రణభూమి కలహించు దినములు గడచిపోయె
సత్యశౌచధర్మంబులసరణి నేర్చి। కాఁపురము సేయు కాంతలు గానరారు
కాల మొకరీతి నుండదు గాదె జగతి। కుటిలజనభంగ ... ... ... 92

సీ. తొంటిమానవు లెంతో ప్రీతిఁ గాఁపాడు సకలధర్మంబులసరణి నేర్చి
కాయకష్టంబున గడియించి మనీషుల సద్బోధ గావించి సకలకార్య
ధౌరేయులుగఁ జేసి తమకులకీర్తుల వెలయించు పుత్రుల విబుధవరుల
నిర్మలహృదయుల నీతిసంపన్నుల ధర్మస్వరూపుల దానపరులఁ
గాంచిప్రఖ్యాతిగాంచినకాంతలెపుడు। కానఁబడుచుండుదినములుగడచిపోయె
కాల మొకరీతినుండదు గాదె జగతి, కుటిలజనభంగ ... ... ... ... 93

సీ. ఆసేతుహిమవన్నగావృతం బగు పుణ్యభరతఖండము మాకు పట్టుకొమ్మ
విజ్ఞానవిలసితవేదశాస్త్రంబులు రహి మాకు నిత్యపారాయణములు
ధర్మసత్యంబులఁ దాల్చి వర్తించుట వెన్నతోడన మాకు బెట్టువిద్య
పరభామలను మాతృభావంబునఁ దలంచి సంచరించుట మాకు సంప్రదాయ
మనుచుదలచెడుఋషివర్యులనవరతము। కానఁబడుచుండుదినములుగడచిపోయె
కాల మొకరీతి నుండదు గాదె జగతి। కుటిలజనభంగ ... ... ... ... 94

సీ. సకల శాస్త్రంబులసార మెఱింగిన విజ్ఞానవేత్తల వేల్పుగిడ్డి
ధర్మసత్యంబులఁ దాల్చి వర్తించెడు పండితవర్యుల పట్టుకొమ్మ
పటుతేజమును జూపు బాహుబలాఢ్యులఁ బ్రభవింపఁజేసెడు పరమసాధ్వి
పతిని దైవంబుగా భావించి మించిన కాంతలఁగడుపారఁ గన్నతల్లి
భరతఖండంబు మాపాలిభాగ్యరాశి। కన్నవారలపైఁ బ్రేమ గలిగి సతము
దీవన లొసంగి బ్రోచు నీ దేశమాత। కుటిలజనభంగ ... ... ... ... 95

సీ. జాతిభేదము లేక సకలజనంబులు నొక్కటే తీరున నుండు నట్లు
సకలవస్తువులను సమకూర్చి జనులకు ధనధాన్యసంపత్తి దనరునట్లు
నైకమత్యంబుతో ననవరతంబును మానవు లందఱు మసలునట్లు
సకలశాస్త్రంబుల సారంబు గ్రహియించి ప్రజలు సన్మార్గులై బ్రతుకునట్లు
విమలదేశాభిమానంబు వెలయునట్లు। జీవన లొసంగి పయత్నోడఁ గావు మనుచు
కాలమూర్తికి నే నమస్కార మిడుదు। కుటిలజనభంగ ... ... ... 96

సీ. ఏమహాత్మునిదాన మెల్లవేళలయందు గంగాప్రవాహమై పొంగుచుండు
నేసుధీవరుకీర్తి నెల్లరు సతతంబు గొనియాడు చుందురు మనములందు
నేసుగుణాకరు నెల్లజనంబులు పరమశాంతుం డని పలుకుచుండు
రేసుమిత్రుఁడు నన్ను నేప్రొద్దు సత్యవో లప్పరాయా యని యాదరించు
నట్టి కస్తూరిరామరా వమరపురికె, నేగి మిత్రుల బంధుల నెన్నరాని
దుఃఖవారాశిలోఁ బడఁద్రోసినాఁడు, కుటిలజనభంగ ... ... ... ... 97

సీ. సజ్జనావళి తన్ను జాల కీర్తింపఁగఁ బాఠశాలల నిల్పె బాలకులకు
విబుధులు తనకీర్తి వేనోళ్ళఁ బొగడ విద్యార్థుల కన్నవస్త్రముల నిచ్చె
సరసులు తనయందు సద్భక్తి జూపఁగ వనితల మాతృభావమునఁ జూచె
కవిజనంబులు తన్ను కైవారములు సేయ పేదల ధన మిచ్చి యాదరించె
నట్టి సరసుఁడు రామరా వనెడువాఁడు। నీతివంతుఁడు నాకు సంగాతకాఁడు
గానఁ గీర్తింతు నీ శతకంబునందు। కుటిలజనభంగ ... ... ... ... 98

సీ. కాంతాజనంబులు కనఁబడినంతన మాతృభావంబున మలులువాఁడు
పరవారి తనవారి భేదంబులేకుండ నొక్కటేతీరున నుండువాఁడు
నిఱుపేదలను జాల కరుణ సంరక్షించి పరులబాధలఁ జూచి వగచువాఁడు
నాశ్రితజనముల యార్తుల గెడపంగఁ బవరాని కష్టముల్ పడెడువాఁడు
సజ్జనావళి తను గొల్వ సంతతంబు। సకలలోకోపకారముల్ సలుపువాఁడు
సఖుఁడు కస్తూరి రాముని సాటి యెవ్వఁడు। కుటిలజనభంగ ... ... ... 99

సీ. కస్తూరికార్ణవగర్భవీచిమతల్లి కడుపార నెవ్వానిఁ గన్నతల్లి
దీనజనంబుల మానససీమ లెవ్వఁడు ఫలింపఁగఁ జేయు పంటకాఁపు
విద్యార్థివత్సల వెత దీర్చి యెవ్వాఁడు పరితుష్టి నొందించు పాడిమొదవు
ఆర్తజనంబుల ననిశంబు నెవ్వాఁడు కరుణమై కాఁపాడు కల్పశాఖి
యతఁడు వెలుఁగొందు రామరాననగబుధులు। కరము వొగడఁగ గొంగు బంగారమగుచు
వాని కిది పూలహారమై వఱలుఁగాక। కుటిలజనభంగ సత్సంగ కోటిలింగ 100

# మానవసేవ.

మత సంఘ పరిశ్రమ భాషావిషయములఁ జర్చించు

## సచిత్ర మాసపత్రిక.

రాజమహేంద్రవరము.

పత్రికాసంపాదకులు—నాళము కృష్ణారావు, సత్యవోలు అప్పారావు.

మ. కరినన్ స్వర్ణ మనేకభూషణములై గన్పట్టు చందంబునన్
పరమాత్ముం డఖిలప్రపంచమయుఁడై భాసిల్లుగావునన్ జరం
నరరూపోజ్జ్వలసర్వభూతములకున్ సంప్రీతి గావించు నన్
నిరతిన్ మానవసేవ సర్వజనముల్ నిత్యంబు సేయందగున్

భూమండలమున మన భరతఖండము తక్క తక్కిన దేశములెల్ల నాగరికతాక్రాంతములై సమస్తసౌఖ్యములతోఁ బిలసిల్లుచు భూలోకస్వర్గములో యన భాసిల్లుచున్నవి. నిన్న మొన్నటివఱకును గన్నులు దెఱవని యీ దేశములు నేఁడు గాఢనిద్రనుండి మేల్కాంచి యొక్కపెట్టున మహోన్నతస్థితి నందుచున్నారు.

అనేకశతాబ్దములకు బూర్వమే లోకపూజ్యులగు మహర్షులచేతను, జగద్విఖ్యాతయశులగు చక్రవర్తులచేతను, దేశభక్తులగు ప్రజలచేతను పరిపాలింపబడు సకలలోకగురుపీఠము నధిష్ఠించిన మన భరతవర్షము నేఁడు కళావిహీనమై యధఃపతితమగుచున్నది.

ఆ కేవల కేవముఖీధురంధరు లగు దేశబంధు లహోరాత్రములు శ్రమపడి సముపార్జించిన జ్యోతిశ్శాస్త్రము గగనకుసుమ మైనది. వైద్యశాస్త్రములు నామమాత్రమునకైన గానరాకున్నవి. శిల్పములు స్వల్పము లైనవి. నేతపనులు చేజాఱిపోయినవి.

అజ్ఞానవ్యాధిగ్రస్తమై ప్రాణమాత్రావశిష్టమై యున్న మనదేశదేహమును సమయసముచితోపాయసిద్ధౌషధసేవనంబున నారోగ్యయుక్తముగ జేయక కతిపయకాలము పేక్షించితిమేని యపాయము సంభవించును. కావున మన యార్యసత్వమును సముద్ధరింపవలయును. మన యాచారముల సంస్కరించుకొనవలయును. సారస్వతము నుజ్జీవింపజేయవలయును. ప్రకృతిశాస్త్రముల బలపరచుకొనవలయును.

ఇవ్విధమున మానవసేవ సేయవలయునని యీ 'మానవసేవను' నెలకొల్పినారము. మానవసేవయె దేశసేవయు, దేశసేవయె యీశ్వరసేవయు, గావున దీనిం జేపట్టి మీపట్టివలెఁ బోషించుభారము మీపయిం బెట్టినారము.

64 పుటలను గలిగి, చిత్రపటశోభితమై విలసిల్లు నీపత్రిక సర్వజనసులభముగ నుండునట్లు సంవత్సరమునకు రు. 3 లు మాత్రమె చందా నేర్పరచినారము. అభిమానులకు రు. 5 లు; పోషకులకు రు. 10 లు; రాజపోషకుల చందాము వారి యనుగ్రహాధీనము,

## మానవసేవా కార్యస్థానమున వెలకు దొరకు గ్రంథములు.

1. కబీరు.—(ఇందు చరిత్రాంశము వచనముగను, ఉపదేశములు పద్యములుగ నుండును) ఆ. శాస్త్రి సూర్యనారాయణగారిచే రచియింపబడినది. 0-2-0

2. బంగాళాదుంప.—నిడదవోలు వేంకటరావుగారిచే రచియింపబడినది. 0-2-8

3. అగ్గిపెట్టెలయంత్రశాల.—కందుల శ్రీమన్నారాయణగారిచే రచియింపబడినది. 0-4-0

4. గోరక్షపావనశతకము—(ఇందలి పద్యములు భక్తిరసము నొలికించును) ఆదిపూడి సోమనాథరావుగారిచే రచింపబడినది. 0-2-0

5. కోటసింగిశతకము.—(రామలింగేశశతకమున ననుసరించి వ్రాయబడినది. ఇందలిపద్యములు నీతిని దేశభక్తిని పురికొల్పును.) సత్యవోలు అప్పారావుగారిచే రచియింపబడినది. 0-3-0

6. స్త్రీలయెడ మనము గావించు పంచమహాపాతకములు. నాళము కృష్ణారావుగారిచే రచియింపబడినది. 0-1-0

7. వీరమతి.—(వీరరసప్రధానమైన యేడంకముల నాటకము. ఇందు దేశాభిమానము, స్వార్థత్యాగము, స్త్రీసాహసము ప్రదర్శింపబడును) మంగిపూడి వేంకటశర్మ, ముప్పన్నేని వేంకటసుబ్బారాయడుగార్లచే రచియింపబడినది. 0-10-0

8. భారతీయసందేశము.—(స్వదేశాభిమానమును, విదేశయాత్రవలని ప్రయోజనములను వెల్లడించు నొక భాణము.) కవికొండల వేంకటరావుగారిచే రచియింపబడినది. 0-1-6

9. భక్తితరంగిణి.—(ఇందు భగవద్భక్తి, దేశభక్తి, మానవసేవ మున్నగువాని గూర్చినపద్యములు గలవు.) 0-2-0